# ఎన్నెల్లో నా లచ్చి



**టి. గిరిరాజులు**
విశ్రాంత సహాయ ఖజాన అధికారి
జిల్లా ఖజానా కార్యాలయము
కర్నూలు.

**రాజ్‌కమల్ ప్రచురణ**
సప్తగిరి నిలయం
పోలీస్‌లైన్ దగ్గర
రాయదుర్గం.
అనంతపురం జిల్లా.

# ENNELLO NAA LATCHI

**T. GIRIRAJULU**
Asst. Treasury Officer (Retd.)
District Treasury
# 50-433, Endowments Colony,
KURNOOL - 518 002. Tel. : 229863



1st Edition, 1000 Copies
December, 2002

**RAJKAMAL PUBLICATION No. 1**

Price : **Rs. 35/-**

Copies can be had from :

**Vishalandhra Publishing House,** Hyderabad
and its branches.

**Navodaya Book House**
Sultan Bazar, Hyderabad.

**Srilekha Sahiti**
H.No. 5-11-481, Vidyaranyapuri,
Hanumakonda. Warangal - 506 009.

**R. Rangaswamy Gowd**
Plot No. 29, Abbas Nagar,
Kurnool - 518 002.

Illustrations :
**Khaja,** Montessori School, Kurnool

Printed at :
**Abhinav Graphics**
Near Gadiyaram Hospital
Kurnool - 518 001.
Tel. : 244787, 242274

# సప్తస్వర సంగీతి



ప్రగతిగీతా ప్రవక్త

**డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య**

శ్రీ టి. గిరిరాజులు గారికి ఆశీరభినందనములు.

ఈ మధ్య డోన్ నుండి శ్రీ రంగస్వామి గౌడ్ గారు వచ్చారు. మీ జానపద గేయాలు ప్రస్తావన వచ్చింది. మీరు కోరిన మేరకు నా పీఠిక "సప్తస్వర సంగీతి" – మీ వ్రాతప్రతులతో పాటు పంపుతున్నాను. మీ జానపద గేయాలు చదివిన నా మిత్రులు అందరు సంతోషించినారు. మీకు వారి అభినందనలు అందించమన్నారు.

మనలోమన మాట – "మధురానగరిలో చల్లనమ్మబోదు దారివిడువుము కృష్ణా" అన్నపాట ఎవరు వ్రాశారు ? ఏమహాకవి వ్రాశాడో ఎవరికీ తెలియదు. నిజానికి ఆపాట వ్రాసింది మహాకవి కాదు. ఒక మానవమాత్రుడైన జానపదకవి. మధురానగరిలో అనేపాట – మనుచరిత్రకు తీసిపోతుందా ? మంచి మనస్సుగల మనుజులు అందరూ జానపద సాహిత్యాన్ని విని ఆనందించి గౌరవిస్తారు.

శ్రీ గౌడు మంచికవి. సహృదయుడు. మృదుమధురంగా ఉంటే నాకు వచన కవిత అయిన జానపద కవిత అయినా ఇష్టమే. అరసం – విరసం వారు వచన కవితతో ఉడుకు నెత్తురు ప్రవహింపచేస్తారు. గౌడు వచన కవిత తీరుతెన్నులే వేరు.

వాడి పదును నుడి కారము
వేడిమి తలకెక్కియుండు విప్లవ కవికిన్
ఆడుచు పాడుచు వ్రాసెడి
గౌడుకు నిలువెల్ల కవిత గద ! గిరి రాజా !

శ్రీ గౌడుకు నీ జానపద కవిత అంకితం ఇవ్వటం నాకు, ఎంతో సంతోషం. మీ చెలిమి చిరకాలము వర్ధిల్లుగాక.

"దేశబాషలందు తెలుగు లెస్స" – అనే పలుకుబడి తలుచుకొని తెలుగు గుండెలు తరచు ఉప్పొంగటం సహజం. తెలుగు బాసను దేశ భాషలందు లెస్సగా తీర్చిదిద్దిన గౌరవం కేవలం తెలుగు పద్యానికి మాత్రమే కట్టపెట్టటం సరికాదు. పద్యంతోపాటు పాటకు కూడా ఆ కీర్తి దక్కుతుంది. పద్యాలలో మీసకట్టు మెలేసి ఉప్పొంగే పౌరుషప్రతాపాలు పరవళ్ళు త్రొక్కుతే, పాటలలో నునుసిగ్గు సింగారాలు తొణికిసలాడే లలనా లావణ్యాలు జాలువారుతాయి.

పద్యం సానబట్టిన వజ్రం అయితే – పాట సానబట్టని పుట్టు రత్నం అని చెప్పవచ్చు. అప్పుడప్పుడు సానబట్టిన జాతి రత్నం కంటె చెక్కిన రంగురాళ్ళు మిలమిల మెరిసిపోవచ్చు. అందుచే జానపదుల గుండెలలో నుండి – కొండలలో నుండి జలజల స్రవించే సెలయేటి ఊటజల్లులవలె జానపదసాహిత్యం ద్రవిస్తుంది. అందుచే అచ్చమైన "కవి"–అసలు సిసలైన కవి. జానపద సాహితీస్రష్టయే అని చెప్పాలి.

శ్రీ గిరిరాజులు పుట్టుకవి. జానపదకవిత పాతాళగంగ వంటిది. ఏ పుట్టలో ఏ పాము ఉంటుందో, ఏ పొట్టలో ఏ పాట ఉంటుందో ! శ్రీ గిరిరాజు వృత్తిచే ఆర్థికశాఖలో ఉన్నత ప్రభుత్వోద్యోగి, ప్రవృత్తిచే జానపద కవి కుమారుడు. కొండలు – కోనలు – పుట్టలు – గుట్టలు – చెట్లు చేమలు – పిట్టలు – ప్రకృతి సౌందర్య సాక్షాత్కారంతో నిలువెల్ల పులకించి, తలపులో తళుక్కుమన్న భావాలను పాటలుగా పాడిన గిరిరాజులు, తల్లిదండ్రులు పెట్టిన పేరును సార్థకం చేసిన సహజ జానపదకవి.

శ్రీ గిరిరాజు ఎన్నో జానపద గేయాలు వ్రాశాడు. వీటిల్లో శృంగారం మాత్రమే గాక, సగటు మనిషి గుండెను కదిపే సన్నివేశాలు అన్నీ ఉన్నాయి.

ఈ జానపద గేయాలలో తెలుగు నుడికారపు వంపులు సొంపులు తామర తంపరలు. ఈ పదాలలో, తెలుగు ఛందస్సుకు విశిష్టత తెచ్చిపెట్టిన యతిప్రాసలు మాత్రమే గాక, కవితా గానమునకు మృదంగ నినాదం చేకూర్చే అంత్యాను ప్రాసలు గూడ ఎడనెడ విన్పిస్తాయి.

శ్రీ గిరిరాజులు వ్యక్తిత్వంలో పేర్కొనదగిన అంశం–చిరుగాలికి కదలి కరిగిపోయె గుండె ఉండటం. ఏదో – పాండిత్యం కొంత సంపాదించి అక్షరాలు పేర్చి పద్యాలు వ్రాయవచ్చు. పాటలు అల్లవచ్చు. పద్యాలు వ్రాసిన వారు అల్లినవారందరూ అసలు కవులు కారు. ఉండవలసింది స్పందించే గుండె.

శ్రీ గిరిరాజులకు స్పందించే గుండెకాయ ఉంది. ఏ పువ్వుచూచినా, ఏ పాట పాడిన కరిగిపోయే సుకుమార సుందర హృదయుడు అచ్చమైన కవి – ఈ గిరిరాజులు.

చిట్టచివరి మాటగా శ్రీ గిరిరాజు జానపద సాహిత్యం గూర్చి చెప్పవలసినది – అతనిని నండూరి సుబ్బారావు గారి నాయుడుబావ "ఆత్మ" పూనినట్లు కన్పిస్తుంది.

నీవు సిలకవై
నేను గోరింకనై
నీవు నాదానవై
నేను నీ వాడనై
విహరించుదామా
పూదోటలోనా !

ప్రతి కవీ ఒక ప్రేమికుడే ! తాత్కాలిక భగ్న ప్రేమికుడు కావచ్చు, అనుభవ శృంగార సిద్ధుడు కావచ్చు. విప్రలంబ శృంగారి కావచ్చు. ప్రేమికుడు ఒక ప్రేయసిని ప్రేమిస్తే - యావత్ ప్రపంచం ప్రేమికుని ప్రేమిస్తుంది.

శృంగార రసం విశ్వజనీనమైనది. అందులో నాగరికత తెచ్చిపెట్టే కృత్రిమత్వం లేని అచ్చమైన ముగ్ధప్రణయం సహృదయులను ఎక్కువగా మురిపిస్తుంది.

కోరమీసం త్రిప్పినీవు
కాడి ఎడ్ల బండి కడితె
కన్నె పిల్లల గుండెలదిరెనురా !
నా సామిరంగా !

శ్రీ గిరిరాజులు ఈ జానపద గేయాలు కొన్ని నాకు చదివి వినిపించి నప్పుడు నేను పొందిన ఆనందం మాటలలో చెప్పలేనట్టిది. అసలు కవిత్వం అనుభవైక వేద్యం.

పద్య ప్రబంధాలు - పాఠం చెప్ప వచ్చును గాని జానపద గేయాలు నిజమైన శ్రవ్య కవితలు. అవి విని ఆనందింప వలసినవే గాని , వింగడించరానివి.

ఆకసమ్ము గ్రమ్మి ఆవరించును గాని
ఎవరి చేతికందు ఇంద్ర ధనువు ?
ఇంపు గొలుపు కవిత - హృదయైక వేద్యమ్ము
వింగడింపరాదు - వెంబడించి.

అనంతపురం ప్రభుత్వ కళాశాలలో నేను తెలుగు అధ్యాపకుడుగా ఉన్నప్పుడు శ్రీ గిరిరాజులు నా ప్రియ శిష్యుడు. ఇప్పుడు వెన్నెలలో నెత్తావులు విరజిల్లే జానపద గేయాలు వ్రాసి నా ఆశీరభినందనలు. అభ్యర్థించినప్పుడు - ఈ అభినందన వాక్యాలు వ్రాయటం, నా పవిత్ర కర్తవ్యం, సంతోషం సంభావన.

శ్రీ గిరిరాజులు - మునుముందు సంగీత సాహిత్యాలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా తన జీవితం తీర్చిదిద్దుకొని చక్కని చిక్కని జానపదగేయాలు వ్రాసి కవితా చిరంజీవిగా వర్ధిల్లుగాక.

**నండూరి రామకృష్ణమాచార్య**
యం.ఎ., పి.హెచ్.డి

మాజీ అధ్యక్షులు,
అధికార భాషా సంఘము,
హైదరాబాదు.

## 'ఎన్నెల్లో నా లచ్చి' పై నా మనసు, మనస్సు



జానపద బ్రహ్మ
**శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్**

మాన్యపాత్రులు టి. గిరిరాజులు గారితో నాలుగు దశాబ్దాలుగా పరిచయ ముంది. నేను గ్రంథపాలకుడుగా జిల్లాలో పలుకేంద్రాలలో పని చేశాను. రాయదుర్గం, అనంతపురం, గుత్తి, ధర్మవరం, కదిరి, గుంతకల్లు మొదలగు పట్టణాలలో పనిచేసిన రోజులలోగ్రంథాలయ దినోత్సవాలు, గ్రంథాలయ వారోత్సవాలు జనరంజకంగా జరుపబడుచుండేవి. ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు విశేషంగా ప్రజాకర్షణ పొందేవి. ఆయా పట్టణాలలోని కళాకారులతో పాటు నేను కూడా జానపదగేయాలు, వేషధారణతో పాడేవాడిని. అందులో కాదరయ్య పాట దేశవ్యాప్తంగా రేడియో, దూరదర్శన్‌ల ద్వారా ప్రచారమయ్యింది. 'బేట్రాయి స్వామి దేవుడా' అనే మరో జానపద గేయం రాయలసీమ అంతటా ప్రతిధ్వనించింది. కదిరి నరసింహ స్వామి మహిమావంతుడైన భగవంతుడు. ఈ స్వామి పేరిట జరిగే రథోత్సవ వేడుకలలో లక్షలాది ప్రజానీకము భక్తి పారవశ్యముతో తన్మయత్వము జెందుతారు. ఒక జానపదుడు నరసింహస్వామిని దర్శించి, తన్మయుడై భక్తావేశముతో స్వామిని దశావతారాలుగా భావించి, ఆశువుగా

"బేట్రాయిసామి దేవుడా – నన్నేలినోడ బేట్రాయి సామి దేవుడా"
కాటామిరాయుడా – కదిరి నరసింహుడా – నీటియిన వేటగాడ – నిన్నే నమ్మతిరా".
బేట్రాయి అనే పాటను అభినయిస్తూ పాడుతాడు.

ఇదే పాటను నేను వేదికపై వేషధారణతో పాడేవాడిని. శ్రోతలంతా ఆనంద పరవశులై తన్మయులయ్యేవారు. ఈ పాటను, ఈ అభినయమును తొలిసారిగా తిలకించిన శ్రీ టి. గిరిరాజులు గారు మిగుల ఆకర్షితుడయ్యాడు. ఆ పాటలోని భావము, అభినయము అతని సాంస్కృత హృదయాన్ని ఆనందపరశునిగా చేసింది. తానుకూడా అట్లాంటి పాటలు రాయాలని, పాడాలని సంకల్పించాడు. ఆ సంకల్పానికి రూపకల్పనే ఈ "ఎన్నెల్లో నా లచ్చి".

ఆ తర్వాత, తర్వాత నండూరి వెంకటసుబ్బారావు గారి ఎంకి పాటలు వీరి కంటబడింది. అది వీరి కంట బడడమే కాదు, వీరి ఒంటా, వెంటా బడిందనడం అతిశయోక్తి కాదు. నండూరి గారి శైలిని, ధ్వనిని, భావమును, ప్రేమతత్త్వమును ఆమూలాగ్రంగా ఆస్వాదించారు, ఆఘ్రాణించారు. అంతే వీరి ప్రతి పాటలో ఎంకి ప్రత్యక్షమవుతుంది. ఎంకే లచ్చి, లచ్చే ఎంకిగా వీరి పాటలలో సహజీవనము చేశాయి.

లచ్చి రూపములో జతపడిన ఎంకి గిరిరాజులను వదలకుండా వెంటాడి

అనేక పాటలను వ్రాయించింది. గిరిరాజు అయిన టి. గిరిరాజులు కొండలు, గుట్టలు, అడవులు, పొలాలు, కోనలు, సెలయేళ్లు, సంతలు, తిరునాళ్లు లచ్చితో కలసిమెలసి జంటగా విహరించారు. లచ్చిపై తనకు, తనపై లచ్చికున్న నిర్మలమైన, నిష్కల్మషమైన నిరంతరమైన ప్రేమ ఒక క్షణము కూడా ఎడబాటును సహించలేనంతగా పెనువేసుక పోయింది.

దాదాపు రెండు దశాబ్దాలకు క్రితమే శ్రీ టి. గిరిరాజుగారు 'ఎన్నెల్లో నా లచ్చి' అను పేరుతో వ్రాసిన జానపద శైలిగేయాలు చిత్తు ప్రతిని, నాకిచ్చి చూడమనికోరారు. వాటిలో కొన్నింటిని చూచి, ఆజానపదశైలిని, నడకను, భావతీవ్రతను హర్షిస్తూ పుస్తక రూపకంగా ముద్రించాలని సూచించాను. శ్రీ టి. గిరిరాజు గారు వెంటనే ముద్రించ డానికి సాహసించలేకపోయారు. రచయితగా గేయకర్తగా తనకు అవసరమైనంత అనుభవము లేదుగదాయని ముద్రించుటకు తటపటాయించారు. ఈలోగా ఎంతో కాలము గడచిపోయింది. కానీ లచ్చి వెంటాడుతూనే వుంది. మరికొన్ని గేయాలు వ్రాసారు. తాను ఉద్యోగరీత్యా పనిచేసిన ప్రతిచోటా సందర్భానుసారంగా సాంస్కృతిక సభలలో తన లచ్చిపాటలను పాడడం, శ్రోతల అభినందనలనందుకోవటము జరుగుతూ వచ్చింది.

కర్నూలు జిల్లాలో ఇరిగేషన్‌శాఖలో పనిచేస్తున్న ఇంజనీర్ మాన్య శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ గారితో ఈ గ్రంథకర్తకు పరిచయము కలిగింది. శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ గారు వృత్తిరీత్యా ఇంజనీర్ అయినా ప్రవృత్తిరీత్యా ప్రముఖ సాహిత్యవేత్త. సహృదయ, సౌజన్యమూర్తి. ఎన్నో రచనలు కూడా చేసి సాహిత్యలోకంలో ఎంతో గుర్తింపు రాణింపు పొందిన ఉత్తములు. ప్రపంచ తెలుగు మహాసభలకు కూడా హాజరయి తనకుగల తెలుగు భాషాభిమానమును చాటుకొన్న విశిష్టవ్యక్తి. వీరు శ్రీ టి. గిరిరాజులు గారి ఎన్నెల్లో లచ్చిని దర్శించి, ఆకర్షితులయ్యారు. శ్రీ టి. గిరిరాజులు గారిని వత్తిడి చేసి ఈ గ్రంథమును ముద్రించాలని పట్టుబట్టారు. వీరి ఉదారమైన ఉత్సాహ, ప్రోత్సాహ, సహకారము వల్లనే ఈ గ్రంథము తొలిసారిగా ముద్రణకునోచుకున్నది. ఇందుకు కృతజ్ఞతగా ఈ గ్రంథమును మాన్యులు, సాహితీవేత్తలు శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ గారికి అంకితమివ్వడం మిగులముదావహంగా భావిస్తున్నాను.

నలుబది గేయాలతో కూడిన ఈ గేయకావ్యము తిరుపతి వెంకటేశ్వరా ! అను భక్తి గేయముతో ప్రారంభమయి, ముక్తిమార్గము అను గేయముతో సమాప్తమయింది. భక్తి, ముక్తిదాయకంగా విజయవంతమైన ఈ గేయకావ్యము ప్రేమానురాగాలలో ఆద్యంతము శ్రోతలను మురిపింపజేస్తుంది.

ఇందులో తిరుపతి వెంకటేశ్వరా !, మాఊరు, గొబ్బిపాట, ఉగాది, కరువుసీమ, జీవితమర్మం, విధిలీల, మాయాలోకం, ముక్తిమార్గము. ఈ తొమ్మిది గేయాలు లచ్చి ప్రసక్తిలేనివి. ఇక మిగిలిన 31 గేయాలు లచ్చి ప్రణయతాండవం, లచ్చి జీవన సౌందర్యం ప్రత్యక్షమవుతుంది. ఎడబాటు సహించలేని అన్యోన్యత కనిపిస్తుంది.

కానీ ఒక్కమారు 36వ గేయములో వెలిబుచ్చిన 'ఎడబాటు' శ్రోతలకే దిగ్భ్రాంతిని కలుగ జేస్తుంది. ఎడబాటుకు కారణమేమో తెలియరానంత గుట్టుగా కనపడుతుంది. బహుశా 34వ గేయము 'తాగొద్దురామావ'ను బట్టి లచ్చి భర్త త్రాగుడుకు లోనైన కారణంగా లచ్చి కాపురం కష్టాలపాలయినదేమో ! విధిలేక తన మావను విడిచి వెళ్లిందేమో, యని తోచు చున్నది.

లచ్చి గుండెరాయి చేసుకొని వెళ్ళింది కానీ, ఆ ఎడబాటును సహించలేని మావ, బ్రతుకు బండ బారిపోయింది. లచ్చి లేని బ్రతుకు, బ్రతుకే కాదని విలపిస్తాడు 36వ గేయం 'ఎడబాటు'లో లచ్చిమావ. ఇలా 31 గేయాలలో లచ్చి-మావల అన్యోన్య ప్రేమానురాగాలు ఎంతనిర్మలమైనవో, నిష్కల్మషమైనవో, శ్రీ టి. గిరిరాజులు గారు అచ్చమైన, సిసలైన జానపద భాషలో, శైలిలో వర్ణిస్తారు.

31వ గేయము 'పొగబండి' ఎంతో ప్రభోదాత్మకంగా వుంది. ఇందులో కూడ పురుడు పోసుకోవడానికి వెళ్ళుతున్న లచ్చి ఎడబాటును భరించలేనంటాడు లచ్చిమావ.

34వ గేయము 'తాగుద్దురామావ' త్రాగుడుకు మగవాడు అలవాటుపడితే కుటుంబ జీవితము అతలాకుతలమవుతుందని తుదకు మానమర్యాదలుండవని, జానపదుల గుండెలను తట్టిలేపినట్లుగా టి. గిరిరాజులు హెచ్చరిస్తారు.

ఇక 37వ గేయం జీవితమర్మం, 38వ గేయం విధిలీల, 39వ గేయం మాయాలోకం, 40వ గేయం ముక్తిమార్గములో వేదాంత ధోరణిలో, జన్మల వల్ల కలిగే ముప్పుతిప్పలు, జన్మసార్థకతకు తెలుసుకోవలసిన, గుర్తించవలసిన మార్గమును చూపెడతారు. ఈ నాలుగు గేయాలు ఆదిశంకరుల భజగోవింద శ్లోకాలను స్ఫురింపజేస్తాయి.

గ్రంథ విస్తర భీతిచేత గేయాలలోని విషయాలను సోదాహరణంగా వివరించ లేకపోయాను. గేయాలన్నీ ద్రాక్షాపాకంగా, జానపదసులభ శైలిలో అరిగిపోయి, కరిగిపోయి, కలిసిపోయే విధంగా ఉన్నాయి.

రసజ్ఞతగల పాఠకులు "ఎన్నెల్లో నా లచ్చి"ని ఆద్యంతము చదివి, తను జీవితాలను సైతము ఆనందమయము, సుఖమయం చేసుకొంటారని ఆశిస్తాను.

ఇంతటి చక్కని, చిక్కని, కమ్మని గేయాలు వ్రాసి పాఠకలోకానికి మహోపకారము చేసిన మాన్యమిత్రులు టి. గిరిరాజులు గారిని అభినందిస్తూ, జానపద కళాభివందనములతో సన్మానిస్తూయున్నాను.

మున్ముందు శ్రీ టి.గిరిరాజుల గారి కలము నుండి మరిన్ని ప్రభోదాత్మక గేయాలు వెలువడాలని విశ్వసిస్తూయున్నాను.

**అమళ్ళదిన్నె గోపీనాథ్**
హాస్య భారతి, సభావాచస్పతి
అధ్యక్షులు, రాయలసీమ జానపద కళాపరిషత్

3-378, సోమనాథనగర్,
అనంతపురం - 515 004.

# అంకితం

కృతి స్వీకర్త

**శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ గారు**

**వారి సతీమణి శ్రీమతి ఆర్. సుగుణమ్మ గారు**



"నిజమైన స్నేహితులను ఆకర్షించే సుగుణముంది నీలో
అదే, నీలోని నిస్వార్థత, యితరుల అభివృద్ధిని కాంక్షించే మనోనిర్మలత"

- శ్రీశ్రీశ్రీ పరమహంస యోగానంద ఉవాచ

ఉన్నత పదవులు నిర్వహించినా, ఉత్తమ రచయితగానే గుర్తింపు
పొందాలనీ, తన మిత్రులచేత రచనలు చేయించాలనీ
తాపత్రయపడే నిరాడంబరమూర్తి, నిర్మలమనస్వి, మానవతావాది

**శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్**

విశ్రాంత పర్యవేక్షక యింజనీరు గారికి
నిండుమనసుతో, సిరిమల్లెల దోసిలితో



కర్నూలు
తేది : 1-12-2002

**టి. గిరిరాజులు**
రచయిత

## స్వీకర్త కృతజ్ఞతాభివందనాలు



కృతికర్తకన్నా, కృతిభర్తనే ఎక్కువ అదృష్టవంతుడనుకుంటాను నేను. ఎందుకంటే, ఒక రచయితకు స్ఫూర్తిదాయకం కావడం అంటే, ఆ రచయిత భావాలకు, ఆలోచనలకు, స్పందనలకు, ఆవేశాలకు, అనుభూతులకు, ఆహ్లాదాలకు మౌన సంకేతాలు అందించడం వరకే స్వీకర్తపాత్ర.

'కృతజ్ఞత' అనేది హృదయానికి సంబంధించిన మహోన్నత సంస్కారం. మన మధ్యనుండి మచ్చుకైనా కనిపించకుండా నేడు మాయమైన హృదయ సౌశీల్యం.

1983వ సం.లో నేను ద్రోణాచలంలో డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేస్తున్నపుడు, శ్రీ టి. గిరిరాజులు, సబ్‌ట్రెజరీ ఆఫీసరుతో ఉద్యోగ రీత్యా పరిచయమయింది. ఆ పరిచయం గత రెండు దశాబ్దాలుగా పరిఢవిల్లి గాఢమైత్రిగా నేటికీ కొనసాగుతుంది.

'ఎంకిపాటల'పైన ఆయనకున్న మక్కువ, పల్లెపాటల రచనల్లోని ఆయన ఒరవడి, ఆ పదాల సొగసు, రాగాల వరస, నిర్మల మనసు ఏనాటికైనా ఓ కవితా సంపుటి ప్రచురించాలనే తీవ్ర ఆకాంక్ష నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయి. దీనికి తోడు కవి మిత్రులు డా॥ అద్దేపల్లి రామమోహనరావు గారి సహకారంతో, సాంస్కృతీ సమాఖ్య సమావేశాల్లో తరచూ పాల్గొనడం జరిగింది. ఆకాశవాణి, కడప, అనంతపురం 'సాహితీ స్రవంతి' కార్యక్రమాల్లో విశేషంగా పాల్గొనడం జరిగింది.

ఈనాటికి ఆయన కోర్కె నెరవేరింది. చిన్నప్పుడు పల్లె వాతావరణంలో పెరగడం వల్ల, ఆ పల్లె జీవితం, పచ్చపచ్చని పొలాలు, మామిడితోటలు, కోయిల స్వరాలు, సెలయేళ్లపరవళ్ల విన్యాసాలు, ఆయన హృదయంలో గాఢంగా ముద్రితాలయ్యాయి.

కవిశ్రేష్ఠులు శ్రీ నందూరి రామకృష్ణమాచార్యుల వారు, ప్రసిద్ధ జానపదకవి శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్ గారల స్ఫూర్తితో, అష్టావధాని డా।। ఆశావాది ప్రకాశరావు సలహాలతో కలంచేత బట్టి, తన గుండెలోయల్లో గూడుకట్టుకున్న ఆనాటి ప్రకృతి అందచందాలు, పల్లె ప్రజల విశ్వాసాలు, సంబరాలు, ఆచారాలకు తోడుగా ఓ అమాయక ప్రేమ జంట కథను జోడించి, లచ్చి స్నిగ్ధసౌందర్యాన్ని ప్రణయ శృంగారాన్ని మధుర గేయాలుగా మలచి మనల్ని రసానుభూతుల్లో ముంచివేసి, చివరగా మానవుని గమ్యం జన్మరాహిత్యం కోరడమేనని 'ముక్తిమార్గాన్ని' బోధించి, పాఠకులకు జీవిత మర్మాన్ని అలతి అలతి పదాలతో వివరించి, రచయిత ధన్యులయ్యారు.

'ఎన్నెల్లో నా లచ్చి' కవితా సంపుటిని, అఖిలాంధ్ర పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తూ, యింతగొప్ప కావ్యాన్ని నాకు అంకితమిచ్చిన శ్రీ గిరిరాజుల సౌజన్యానికి, హృదయసౌందర్యానికి నా హృదయపూర్వక అభినందనలు.

**ఆర్. రంగస్వామి గౌడ్**
విశ్రాంత పర్యవేక్షక యింజనీరు,కర్నూలు.
భారతీయ రచయితుల సమాఖ్య సభ్యులు,
హైదరాబాద్



## నా మాట ...

**టి. గిరిరాజులు**
పుస్తక రచయిత

నేను 1960 సం.లో అనంతపురంలో వుద్యోగం చేసే రోజుల్లో కీ.శే. నండూరి సుబ్బారావు గారి "ఎంకి పాటలు" స్ఫూర్తితో జానపదగేయాలు రాయడానికి శ్రీకారం చుట్టాను. బస్సు ప్రయాణంలో యిరువైపులా కనిపించే ప్రకృతి సౌందర్యాలని చూసినప్పుడల్లా నాలో కలిగిన భావాలను యెప్పటికప్పుడు అక్షరరూపంలో పెట్టడం ఆరంభించాను.

1983 సం.లో నేను ద్రోణాచలంలో సబ్‌ట్రెజరీ ఆఫీసర్‌గా పని చేసేటప్పుడు ప్రముఖ కవి రచయిత శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్, డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, గారితో పరిచయ భాగ్యం కలిగింది. వారి ప్రోత్సాహంతో నేను నా కవితా వ్యవసాయాన్ని కొనసాగించగలిగాను. నా కవితలను ఆకాశవాణి కడప కేంద్రానికి పంపడంలోను, అనేకమార్లు "కవితావాహిని" కార్యక్రమాల్లో నేను పాల్గొనేలా చేయడంలోను యెంతగానో సహకరించారు. నేను పొన్నూరు, గుంటూరు, విజయవాడలలో "సాంస్కృతీ సమాఖ్య" ఆధ్వర్యములో జరిగిన సాహిత్య సభల్లో, కవి సమ్మేళనాలలో పాల్గొన్నానంటే అది వారి చలవే ! నిరంతర కృషితో నేను సాహిత్యపరంగా పురోగతి సాధించేందుకు సర్వవిధాలా తోడ్పడిన స్నేహశీలి, నా శ్రేయోభిలాషులు, శ్రీ రంగస్వామి గౌడ్ గారు. నాచే యీ సంపుటాన్ని వెలువడేలా చేశారు.

అందుకు కృతజ్ఞతా సూచకంగా చంద్రునికో నూలుపోగులా యీ పుస్తకాన్ని అంకితం యిస్తున్నాను.

ఎప్పటికప్పుడు తగిన సూచనలు, సలహాలిస్తూ నన్ను వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ, నేను కోరగానే యీ సంపుటికి తమ అమూల్యమైన అభినందనాశీస్సులు అందించిన మా గురువర్యులు, కవిశ్రేష్టులు, ప్రగతి

గీతాప్రవక్త, మాన్యులు డా. నందూరి రామకృష్ణమాచార్యుల వారి పెద్ద మనసుకు నా వినమ్రపూర్వక నమస్సులు అర్పిస్తున్నాను.

జానపద సాహిత్యంలో నాకు మార్గదర్శకులు, నాకు స్ఫూర్తిప్రదాతలు, నేను కోరినంతనే ఎంతో ప్రేమతో నన్ను అభినందిస్తూ 'ఎన్నెల్లో నా లచ్చి' పల్లెపదాలకు సువర్ణమణిమయ భూషణాలవంటి పరిచయ వాక్యాలను రాసి పంపిన హాస్యభారతి, జానపదబ్రహ్మ శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్, (అనంతపురం) గారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

నన్ను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సాహితీక్షేత్రంలో నన్ను ప్రోత్సహించిన అష్టావధాని, కవి, కళాప్రపూర్ణ శ్రీ ఆశావాది ప్రకాశరావు గారికి నా అభివందన చందనాలు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతీ సమాఖ్య అధ్యక్షులు, ప్రముఖ విమర్శకులు, సుప్రసిద్ధ రచయిత, వర్ధమాన రచయితలకు కరదీపిక వంటి డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు (కాకినాడ) గారికి నా శతాధిక వందనాలు.

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జానపదకళలశాఖాధ్యక్షులు డా. చిగిచర్ల కృష్ణారెడ్డి గారు తమ "ధర్మవరం జానపదగేయాలు" పుస్తకా విష్కరణ సందర్భంగా, నా గేయాలను చదివి, యెంతో ఆనందించి, నా భుజంతట్టి మరిన్ని గేయాలను రాసి పుస్తకరూపంలో తేవాలని ఆకాంక్షించిన విశాల హృదయులు. వారికి నా హార్దిక కృతజ్ఞతాంజలులు.

నన్ను తన ఆత్మీయునిగా భావించి, నా పుస్తక ప్రచురణ కార్యభారాన్ని తన బాధ్యతగా భుజాన వేసుకొని, పుస్తకాన్ని ఆద్యంతం సర్వాంగ సుందరంగా రూపొందడానికి సహకరించిన మిత్రులు, రచయిత, శ్రీ జి. శుభాకరరావు గారికి హార్ధిక అభివందనాలు. నా పురోభివృద్ధిని సదాకాంక్షించే సహృదయ సాహితీమూర్తులు, శతవధాని, శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ (ద్రోణాచలం) గారికి, డా. యం. ఆదినారాయణ శాస్త్రి, (అనంతపురం) గారికి, శ్రీలేఖసాహితి అధ్యక్షులు, రచయిత డా. టి. రంగస్వామి (హనుమకొండ) గారికి, కర్నూలు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు, శ్రీ హెచ్. హీరాలాల్ గారికి, జిల్లా

గ్రంథాలయ సంస్థ మాజీ కార్యదర్శి, శ్రీ కె. రోశయ్య గారికి, కర్నూలు జిల్లా గ్రంథాలయ సంస్థ మాజీ అధ్యక్షులు శ్రీ చంద్రశేఖర కల్కూర గారికి, ప్రస్తుత అధ్యక్షులు శ్రీ కె.జి. గంగాధర రెడ్డి గారికి, కర్నూలు కళాసమితి కార్యదర్శి శ్రీ జె.ఎస్.ఆర్.కె. శర్మ గారికి, ఆంధ్రోపన్యాసకులు శ్రీ తిప్పన్న (కళ్యాణదుర్గం) గారికి, నా చిన్ననాటి స్నేహితులు శ్రీ యం. కేశవులు (రాయచోటి) వీరందరికి నా మనఃపూర్వక అభివందనాలు.

నా సంపుటి ముఖ చిత్రాన్ని అందంగా చిత్రీకరించిన ఆర్టిస్టు శ్రీ ఖాజా (మాంటిస్సోరి స్కూలు, కర్నూలు) గారికి, నేను కోరిన విధంగా యీ పుస్తకాన్ని సుందరంగా ముద్రించిన శ్రీ గోపి, అభినవ్ గ్రాఫిక్స్, కర్నూలు గారికి నా అభినందనలు.

నా సాహిత్య వ్యాసంగంలో నేను తలమునకలై కుటుంబ బాధ్యతల్లో కొంత అసౌకర్యాన్ని కలిగించినా, శాంతంతో, సహనంతో మొదటి పాఠకురాలిగా శ్రోతగా సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి కమలకు, మా చిరంజీవులకు నా అభిమర్శనాశీస్సులు.

వివాహం జరిపిన నాటినుంచి, అహర్నిశలు మా దంపతుల శ్రేయస్సు మనసారావాంఛిస్తూ, జామాతగా కాక స్వంత కుమారునిలా చూసుకుని, నేను ఎరుగని లోకాలకు వెళ్లిపోయిన మా మామగారు కీ.శే. ఈజర్ల సుబ్బయ్య శెట్టి గారికి, వారి ధర్మపత్ని శ్రీమతి రామలక్ష్మమ్మ, పామిడి, గారలకు నమస్సుమాంజలులు.

పల్లెలో పుట్టి, పల్లెలో పెరిగినా తమ పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించాలని ఎంతగానో తపించి, శ్రమించి, మమ్మందరినీ వుద్యోగస్థులుగా చూచి, జన్మ తరించిదనే తృప్తితో అనంతతీరాలకు సాగిపోయిన నా తల్లిదండ్రుల స్మృతి తరంగాలు చుట్టుముట్టిన యీతరుణంలో, నా గుండెలోయల్లోంచి 'రాజా' అని వినిపించే అమృతగళాల మధురిమలో నన్ను నేనే మరచిపోయి, ఒంటరిగా మౌనబాష్పాలు రాలుస్తూ .... నిలుచున్నా ..... !

**టి. గిరిరాజులు**

# "ఎన్నెల్లో నా లచ్చి"

## కథాసంగ్రహం

"లచ్చి", "మావ", ప్రేమజంట. ఒకరినొకరు ప్రేమించుకొని - చట్ట పట్టాలేసుకొంటూ, చెట్టు, పుట్ట, చేను, గట్టూ, కొండా, కోనా, వాగు, వంక, యేర్లు, సెలయేర్లు, పంటపొలాలో తిరుగుతూ ప్రకృతినే ఎల్లలుగా చేసుకొని, నీలమేఘాలలో తెలిపోయేపక్షుల జంటలా విహరిస్తూ, ప్రేమ జంటల ఆనందానికి హద్దులు లేవంటూ ప్రొద్దుగడి పేస్తుంటారు.

మొదలే పల్లెటూరు, అందులో పెళ్ళికాని జంట, కొండకోనల్లో, పంట పొల్లాల్లో తిరగడం లచ్చికి భయం వేసింది. ఊరి పెద్దలు ఉరిమురిమి చూస్తారని, అమ్మలక్కలు చూసి 'అపవాదు' లేస్తారని భయపడి, తన మెళ్ళో మూడుముళ్ళు పవిత్ర 'బంధం' వేయమని, 'కదిరి తిరుణాల'లో కోరుతుంది లచ్చి.

లచ్చి కోర్కెను తీర్చాలని, లచ్చిబాధను అర్థం చేసుకొన్న 'మావ' పెళ్ళికి కావలసిన వస్త్రములు, వస్తువులు ఊరూరా తిరిగి సేకరించి 'తిరుమలేశుని సన్నిధి'లో తాలిబొట్టు కట్టేస్తాడు. 'పూలపల్లకి'లో ఊరేగిస్తాడుమావ. వారి పెళ్ళి జరిగిపోతుంది. కొన్నాళ్ళకు వారికి సంతానం కల్గుతుంది. కష్టకాలంలో ఎక్కువ సంతానం కష్టమని భావించిన లచ్చి మావతో తాను 'కుటుంబ నియంత్రణ' ఆపరేషన్ చేయించుకొంటానని కుటుంబ నియంత్రణ పాటిస్తే కష్టాలు తొలగి-పోతాయని, సుఖజీవనం సాగించవచ్చునని చెప్పి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకొంటుంది.

లచ్చి, మావ ప్రేమ వివాహ చేసుకొన్నా ఎంతో పవిత్రంగా అన్యోన్యంగా, ఆనందంగా సుఖజీవనం సాగిస్తారు. లచ్చి, మావకు సరైన జోడి. లచ్చి పరిచర్యలకు పరవసించిన మావ "మా ఇంటి మా లచ్చి" అని మురిసిపోతాడు. ఇంటి దేవుడైన తిరుమలేశుని దర్శించుకొని, స్వామిమొక్కుబడి తీర్చాలని లచ్చితో తిరుపతికి పయనమవుతాడు 'మావ'.

కరువుసీమలో పంటలు సరిగా పండగ వారి జీవితం దుర్భరమై కష్టాల పాలవుతుంది. కష్టాలు మరచిపోవాలని మావ త్రాగుడుకు అలవాటుపడుతాడు. మావ ప్రవర్తన గురించి లచ్చి చాలా బాధపడుతుంది. త్రాగుడు మానమని పలుసార్లు సలహాలిస్తుంది. జీవనం జరుగక, సంతానాన్ని పోషించుకోలేక, పనులు దొరకక పస్తులతో కాలంవెళ్ళబుచ్చుతూ, మారని మావను చూసి, విరక్తి చెంది, దేవుని నమ్ముకొని "గోదావరి పుష్కరాలకు" వెళ్ళి వస్తానని చెప్పి, మరల తిరిగిరాని లోకాలకు వెళ్ళిపోతుంది "లచ్చి".

లచ్చి 'యెడబాటు'ను తలచుకొంటూ, భారమైన బ్రతుకును ఈడ్చుకొంటూ, సంతానాన్ని పోషించుకోలేక, ఈతి బాధలను ఎదురీదలేక జీవితంపై విరక్తి చెంది, దేవుని సన్నిధిని చేరాలని భక్తి భావనతో "ముక్తిమార్గం" వెదుక్కొంటూ, ఊరూరా తిరుగుతూ, తత్వగీతాలుపాడుకొంటూ జీవన పయనం సాగిస్తాడు "మావ".

రచన

**టి. గిరిరాజులు**

కర్నూలు.

విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | తిరుపతి వెంకటేశ్వరా ! | 1 |
| 2. | మా ఊరు | 3 |
| 3. | ఎన్నెల్లో నా లచ్చి | 5 |
| 4. | పలకవేలనె సిలక | 6 |
| 5. | జొన్నసేలలో లచ్చి | 9 |
| 6. | లచ్చిమనసు | 11 |
| 7. | కపిల (మోట) | 13 |
| 8. | లచ్చిమాట - పాట | 14 |
| 9. | కన్నెపిల్ల | 15 |
| 10. | గుత్తికోట | 16 |
| 11. | సిలకమ్మ | 17 |
| 12. | గొబ్బిపాట | 18 |
| 13. | సంకురాతిరి, శివరాతిరి | 20 |
| 14. | లచ్చిమనసు | 22 |
| 15. | మనజంట | 23 |
| 16. | బంధము | 25 |
| 17. | ఉగాది | 27 |
| 18. | కదిరితిరణాల | 28 |
| 19. | పల్లకి | 29 |
| 20. | మా ఇంటిమాలచ్చి | 31 |

| | | |
|---|---|---|
| 21. | లచ్చితో తిరుపతి | 33 |
| 22. | లచ్చి వలపు | 35 |
| 23. | కొర్రసేను | 36 |
| 24. | కొంగుముడి | 39 |
| 25. | ఎర్రిలచ్చిమి | 40 |
| 26. | లచ్చి అలక | 41 |
| 27. | లచ్చిజాడ | 43 |
| 28. | మావ మోజు | 45 |
| 29. | సందెకాడ | 47 |
| 30. | నాగులచవితి | 48 |
| 31. | పొగబండి | 49 |
| 32. | కరవుసీమ | 51 |
| 33. | ఎర్రత్రికోణం | 53 |
| 34. | తాగొద్దురామావ | 54 |
| 35. | లచ్చిపయనం | 55 |
| 36. | ఎడబాటు | 57 |
| 37. | జీవితమర్మం | 59 |
| 38. | విధిలీల | 60 |
| 39. | మాయాలోకం | 61 |
| 40. | ముక్తిమార్గం | 62 |

# తిరుపతి వెంకటేశ్వరా !

("పేట్రాయి స్వామి దేవుడా !" బాణీలో)



తిరుపతి వెంకటేశ్వరా ! కాపాడరావ
తిరుమల శ్రీనివాసుడా ......
వడ్డీకాసులవాడ
మూడూ నామాలవాడ
ఏడు కొండలపైన
యెంచక్క ఉన్నవాడ ..... ॥ తిరుపతి ॥

వైకుంఠ మొదలి వస్తివి
ఓ దేవ దేవ !
భూలోక వాసి వైతివి
పుట్టలోన సేరి నీవు
ఆవుపాలు తాగినావు
గొల్లవాడు నిన్ను కొట్ట
శాపమిచ్చి యెల్లినోడ ..... ॥ తిరుపతి ॥

ఆకాశరాజు వద్దకు
ఓ నల్లనయ్య
అల్లుడిగ నీవు యెల్తివి
ఆనందమొంది రాజు
పద్మావతమ్మనిచ్చి
దేవ ఋషులు మెచ్చునట్లు
పెళ్ళినీకు సేసినాడు ..... ॥ తిరుపతి ॥

ఆదిలచ్మి నిన్ను సేరెరా
ఓ శ్రీనివాసా !
అలిమేలు అలుక బూనెరా
పోరు నీవు పడలేక
ఊరు వాడ యిడిసినావు
కొండపైన కొలువు తీరి
బండరాయిగ మారినోడ ..... ॥ తిరుపతి ॥

అన్నమయ్య నిన్ను కొలవగా
ఓ నల్లనయ్య !
మెచ్చి నీవు మోక్షమిస్తివి
భక్తులంత నిన్ను సేర
ప్రేమ తోడ ఆదరించి
కోరినవరములిచ్చి
కోర్కెలెల్ల తీర్చినోడ ..... ॥ తిరుపతి ॥



కొండ మెట్లు యెక్కి వస్తిమీ
కోనేటి రాయ !
కురులు మేము నీకు యిస్తిమీ
గోవింద ! అనగానే
ఓయంటు పలుకుతావు
మహిలోనయెలసి నీవు
మహిమలెన్నో సూపినోడ ..... ॥ తిరుపతి ॥



# మా ఊరు



రాయదుర్గం మండలమురా
రాయలసీమలో ఉన్నదిరా
"కొండాపురము" మా పల్లెరా
ఆ పల్లెలోన పుట్టినానురా ...

"దుగ్గెమ్మ" మా ఊరి దేవతరా
"మారుతి" మా ఊరి దేవుడురా
"హొన్నూరు స్వామి" దరగారా
వరములు యిచ్చే దేవుళ్ళురా...

దుగ్గెమ్మ, దుగ్గెమ్మ ఉయ్యాలో
మా ఊరి దుగ్గెమ్మ ఉయ్యాలో
కొండాపురము దుగ్గెమ్మ ఉయ్యాలో
కాపాడు మా తల్లి ఉయ్యాలో...

ఊరికి సేవలు ఉయ్యాలో
సేసిరీ పెద్దలు ఉయ్యాలో
మా ఊరి పెద్దలు ఉయ్యాలో
మా మంచి వారమ్మ ఉయ్యాలో...

కురవాలి వానల్లు ఉయ్యాలో
పండాలి పంటలు ఉయ్యాలో
మా ఊరి పెజలంత ఉయ్యాలో
సుఖముగ ఉండాలి ఉయ్యాలో...





ఎన్నెల్లో నా లచ్చి వొన్నెనే సూత్తంటె
వొన లచ్చి మనపించె మనసులో నాకు ...

# ఎన్నెల్లో నాలచ్చి

ఎన్నెల్లో నా లచ్చి
వొన్నెనే సూత్తంటె
వొన లచ్చి మనపించె
మనసులో నాకు ... ॥ ఎన్నెల్లో ॥

సాపమీద లచ్చి
సరసమాడుతావుంటె
అందాల సందమామ
దొంగ సూపులుసూసె ... ॥ ఎన్నెల్లో ॥

సక్కనీ నాలచ్చి
పక్కనా కూకుండి
సుద్దులాడుతు వుంటె
ఎన్నపూసలా పొద్దు కరిగిపోతాది ॥ ఎన్నెల్లో ॥

యెన్నెల్లో తానాలు
మేము సేత్తావుంటె
సుక్కల్లు మా పక్క
నిక్కినిక్కి సూశాయి ... ॥ ఎన్నెల్లో ॥



# పలుక వేలనె సిలక ?

పలుక వేలనె సిలక
ఎందుకే నాపై నీకింత అలుక ?
కాకమ్మతో నేను
కబురు సెప్పంపితి
గువ్వమ్మతో నేను నా
గురుతు సెప్పంపితి
కోయిలమ్మతో నా
కోర్కె సెప్పంపితి
నెమలమ్మతో నా
నెలవు సెప్పంపితి
రాకపోతి వెందుకే
నా రతనాల సిలక .... ॥ పలుక ॥

చిక్కిపోయావెందుకే
చిన్నారి సిలక ?
సింతలెందుకె నీకు
నీసెంత నేనుండ
యలమావి తోటలో
యెదురు సూత్తుంటావని
యెన్ని సార్లొస్తినో
యెన్నెల మావకెరుక
రాతపోతివెందుకే
నారతనాల సిలుక ॥ పలుక ॥



జాజిమల్లి తోటలో
జామచెట్టు నీడలో
జతకూడిమనమేమొ
జామపండ్లు తిన్నాము
జలకాలాట లాడాము
జంటగా తిరిగాము
జరిగినదంతా మరిచావటే
జాణైన నా సిలక
రాకపోతివెందుకే
నా రతనాల సిలక ॥ పలుక ॥

నా సిలక పలుకాలి
నా నోము పండాలి
నాతోటే వుండాలి
ననువీడకెపుడు
ననుసేరరావా ?
జతకూడరావా ?
ననుసేరరావే
నా రతనాల సిలక ॥ పలుక ॥

నీవు సిలకవై
నేను గోరింకనై
నీవు నాదానవై
నేను నీవాడనై
విహరించుదామా
పూదోటల్లోనా .... ॥ పలుక ॥





వరిమడిలో నా లచ్చి వరినాట్లు వేస్తుంటె
ఇంద్రసాపము నా ముందు వంగినట్లనిపించె ....

# జొన్నసేలలో లచ్చి ...

జొన్న సేలలో లచ్చి
కంకులు కోస్తుంటె
పైట కిందికి జారె
పై ఎదలు అదిరె ....

వంగ తోటలో లచ్చి
వొంగి కాయలు కోస్తుంటె
వొంపు సొంపులు నాముందు
వొలకబోసినట్లాయె ....

వరిమడిలో నా లచ్చి
వరినాట్లు వేస్తుంటె
ఇంద్రసాపము నా ముందు
వంగినట్లనిపించె ....

యేటి గట్టున లచ్చి
పాట పాడుతు వుంటె
కోటి రాగాల వీణ
మీటినట్లనుపించె ....





సంతకెళ్తానంట లచ్చి  సింతసేత్తాది
సందెకాడికి  గుడిసె సేరుకోమంటాది ...

# లచ్చి మనసు

సంతకెల్తానంట లచ్చి
సింతసేత్తాది
సందెకాడికి
గుడిసె సేరుకోమంటాది ...

పొలము కెల్తానంట లచ్చి
పోవద్దు అంటాది
పొద్దుగూకక మునుపె
గుడిసె సేరమంటాది ...

జాతర కెల్తామంటె లచ్చి
జతకు రానంటాది
జాముపొద్దుకెల్ల
జతసేరమంటాది ....

కొండ కెల్తానంటె లచ్చి
కంట నీరెడుతాది
సెంత నేనుంటేను
సింత లేదంటాది





కళ్ళకేమో కాటుకెట్టుకో
కడవనేమో సంకనెట్టుకో
ఇంటికెళ్ళి వంటసేసి
సద్దిగంపా నెత్తినెట్టుకో ...

# కపిల (మోట)

లచ్చి : కపిల తోలే కాపు కొడుకో
కాడి యెడ్ల మోకు బట్టుకో
బావిలోన బానముంచి
నీళ్ళుతోడి పైరుబెట్టుకో ...

మావ : కళ్ళకేమో కాటుకెట్టుకో
కడవనేమో సంకనెట్టుకో
ఇంటికెళ్ళి వంటసేసి
సద్దిగంపా నెత్తినెట్టుకో ...

లచ్చి : ఆకులోన అన్నమెట్టుకో
అందులోనా వలపునంజుకో
ఆకువక్కావేసుకోని
నా అందమంతా నీవు జుర్రుకో ...

మావ : కొత్తసీర నీవుకట్టుకో
కొప్పులోన పూలు పెట్టుకో
యింటికాడ మంచమేసి
సందెకాడ నన్ను సేరుకో ....



# లచ్చి మాట, పాట

వినాలి నాలచ్చి మాటలాడంగ
వినాలి నాలచ్చి పాటపాడంగ

నాపైన మనసంట
తనువంత నాదంట
బతుకంత వలపంట
నమవీడి పోదంట .... ॥ వినాలి ॥

సీరలు వద్దంట
సారెలు వద్దంట
సొమ్ములు వద్దంట
నేనుంటె సాలంట .... ॥ వినాలి ॥

సిలకమ్మ చెలిమంట
నెమిలమ్మ నెలవంట
సందమామను సూసి
సిందులేస్తాదంట ... ॥ వినాలి ॥

పచ్చికే పాన్పంట
పందిరే గుడెసంట
వెన్నెలే వెలుగంట
ఇద్దరం జోడంట .... ॥ వినాలి ॥



# కన్నెపిల్ల

మావ : కాలిబాట ఎల్లేటి కన్నెపిల్లా !
నీకు తుమ్మముల్లు గుచ్చుకొంది సూడు పిల్లా !

లచ్చి : తుమ్మముల్లు గుచ్చుకోదు సిన్నవాడా !
నేను సెప్పులేసుకొచ్చినాను సూడలేదా ?

మావ : యెదురెండ కెళ్ళబోకు సిన్నదాన !
నీ బుగ్గలేమో కందిపోవు వన్నెదాన !

లచ్చి : నీ అండదండ నాకువుంటె సిన్నవాడా !
నాకు ఎదురెండ పడదులేర వన్నెకాడా !

మావ : ఏటిగట్టు కెళ్ళబోకు సిన్నదాన !
మడుగులోన మొసలుంది వన్నెదానా !

లచ్చి : అసలు, సిసలు మొసలినీవె సిన్నవాడా !
నీ మనసు నాకు తెలిసెలేర సొగసుగాడా !

మావ : గట్టుమీది కెళ్ళబోకు సిన్నదానా !
నీవు పట్టుజారి పడుతావు వన్నెదానా !

లచ్చి : గట్టిగాను పట్టుకొంటె సిన్నవాడా !
నేను పట్టుజారి పడనులేర వన్నెకాడ !

మావ : అడవిలోనికెళ్ళబోకు సిన్నదాన !
గొడవేదొ జరిగేను వన్నెదాన !

లచ్చి : గొడవేది జరుగదోయి సిన్నవాడా !
నీవు నావెంట బడకోయి వన్నెకాడా !

మావ : ఒంటరిగ వెళ్ళబోకు సిన్నదానా !
నీవెంట నేనొస్తా వన్నెదానా !

లచ్చి : నావెంట రాకోయి సిన్నవాడా !
నీకొంటెమనసు తెలిసెలేర వన్నెకాడ !

# గుత్తికోట

మావ : సెవిపట్టి గుత్తికొండ
సూపించనా, నీకు సూపించనా
కొండపైన కోట వుంది
కనిపించెనా ? ....

లచ్చి : కోటలోన కొలనుంది
జలకమాడనా ?
జలక మాడి కురుల తోటి
ముడి వేయనా ?

మావ : కోటలోన పాగవేసి
నిన్ను వుంచనా ?
ప్రేమపాశమేసి
నిన్ను బంధించనా ?

లచ్చి : అందమంత కొంగుతోన
కప్పి వేయనా ?
సందమామ యెన్నెల్లో
విందు సేయనా ? ...



# సిలకమ్మ

మావ : తుంగభద్ర డ్యాములోకి
తొంగిసూసె సిన్నదాన
పైటకొంగు జారిపోయె
సేపలన్ని సెదరిపోయె ...

లచ్చి : గుండు కింద నీడలోన
పొంచి యున్న సిన్నవాడ
గాలమేసి లాగబోకు
గావు గుండెలున్నవాడ ...

మావ : సిలకరంగు సీరకట్టీ
సిందులేసె సిన్నదానా
సందమామ తొంగిసూసె
యెన్నెలంత వొలకబోసె ....

లచ్చి : సెట్టుకింద నీడలోన
సక్కనైన సిన్నవాడా
సుక్కలన్ని సూసెలేరా
పక్కలోనా సేరిపోరా !

మావ : కొమ్మ మీద సిలకమ్మా
లచ్చితోటి సెప్పమ్మా
నా మనసునంత దోసినాదని
మళ్ళి మళ్ళి సెప్పవమ్మా !

లచ్చి : గూటిలోని గోరువంకా
నీగుట్టు నాకు తెలిసెనింకా
నా మావ నెలవంక
నేసూడలేక బతకనింక ...

# గొబ్బిపాట

గొబ్బీయల్లో, గొబ్బీయల్లో
సంకురాతిరి పండుగొచ్చె గొబ్బీయల్లో
సంబరాల పండుగొచ్చె గొబ్బీయల్లో ...

పుష్యమాసం పండుగొచ్చె .... గొబ్బీయల్లో
పుణ్యకాలం వచ్చినాది .... గొబ్బీయల్లో
సూర్యదేవుడు వొచ్చినాడు .... గొబ్బీయల్లో
మకరరాశి సేరినాడు .... గొబ్బీయల్లో

భోగిమంట లేసినారు .... గొబ్బీయల్లో
కళ్ళాపి సల్లినారు .... గొబ్బీయల్లో
ముగ్గులెన్నొ పెట్టినారు .... గొబ్బీయల్లో
గొబ్బిళ్ళు పెట్టినారు .... గొబ్బీయల్లో

గుమ్మడి పూలు పెట్టినారు .... గొబ్బీయల్లో
తంగెడు పూలు సల్లినారు .... గొబ్బీయల్లో
బంతిపూలు కట్టినారు .... గొబ్బీయల్లో
సేమంతులల్లినారు .... గొబ్బీయల్లో

తోరణాలు కట్టినారు .... గొబ్బీయల్లో
గడపకు పసుపు పూసినారు .... గొబ్బీయల్లో
బొమ్మల కొలువు పెట్టినారు .... గొబ్బీయల్లో
భోగిదాన మిచ్చినారు .... గొబ్బీయల్లో

పాడిపంట పండుగొచ్చె .... గొబ్బీయల్లో
ఇంటినిండ ధాన్యాలు .... గొబ్బీయల్లో
అన్నపూర్ణ ఇంటిలోన .... గొబ్బీయల్లో
పిండి వంటలు సేసినారు .... గొబ్బీయల్లో

అల్లుళ్ళు వచ్చినారు .... గొబ్బియల్లో
అలుకపాన్పు వేసినారు .... గొబ్బియల్లో
కూతుళ్ళు వచ్చినారు .... గొబ్బియల్లో
కొత్తకోకలు కట్టినారు .... గొబ్బియల్లో

బావగారు వచ్చినారు .... గొబ్బియల్లో
బడాయిలు సూపినారు .... గొబ్బియల్లో
మరదళ్ళు వచ్చినారు .... గొబ్బియల్లో
మంచిగంధం పూసినారు .... గొబ్బియల్లో

బుడబుడకలోడు వచ్చినాడు .... గొబ్బియల్లో
హరిదాసువచ్చినాడు .... గొబ్బియల్లో
సాతాని జియ్యరొచ్చె .... గొబ్బియల్లో
గంగిరెద్దుల మేళాలొచ్చె .... గొబ్బియల్లో

జంగమదేవర వచ్చినాడు .... గొబ్బియల్లో
ఎరుకసాని వచ్చినాది .... గొబ్బియల్లో
ధాన్యాలు పొందినారు .... గొబ్బియల్లో
దీవించి వెళ్ళినారు .... గొబ్బియల్లో

కోళ్ళపందెమాడినారు .... గొబ్బియల్లో
కోలాటమేసినారు .... గొబ్బియల్లో
పల్లెలోనిరైతులంత .... గొబ్బియల్లో
పార్వాటమాడినారు .... గొబ్బియల్లో

సందమామ యెన్నెల్లో .... గొబ్బియల్లో
సెమ్మసెక్కలాడినారు .... గొబ్బియల్లో
సంకురాతిరిలచ్చిమొచ్చి .... గొబ్బియల్లో
సల్లగాను దీవించె .... గొబ్బియల్లో



# సంకురాతిరి - శివరాతిరి

మావ : రాతిరీ, రాతిరీ సంకురాతిరీ
రేయంత గిలిగింత నేటిరాతిరీ

లచ్చి : రాతిరీ, రాతిరీ శివరాతిరీ
రేయంత జాగారము నేటిరాతిరీ

మావ : సిగ్గుతోన ముగ్గువేసి
గొబ్బిపెట్టింది
కొత్త లంగ, వోణి వేసి
సిందులు తొక్కింది ... ॥ రాతిరీ ॥

లచ్చి : యఱ్ఱఅంచు పంచెకట్టి
కఱ్ఱసేత బట్టాడు
సెట్టుమీద కోతిబావ
యెగిరి గంతులేశాడు .... ॥ రాతిరీ ॥

మావ : మేనత్త కూతురంటు
మెత్తగా తగిలింది
మత్తుమందు యేదొ సల్లి
నెత్తినెక్కి కూర్సుంది .... ॥ రాతిరీ ॥

లచ్చి : మేనమామ కొడుకంటు
మెల్లగా వచ్చాడు
సందమామ నేనంటు
సెవిలోన సెప్పాడు .... ॥ రాతిరీ ॥

మావ : అలిగొచ్చి తానేమో
అలకపాన్పు వేసింది
పలుకరించనేపోతె
పట్టువదలకున్నాది .... ॥రాతిరీ ॥

లచ్చి : అలిగొచ్చి తానేమో
నులకమంచమేశాడు
అందులోని ఎర్రతేలు
అదును సూసి కుట్టింది .... ॥ రాతిరీ ॥





# లచ్చి మనసు

యేమాని సెప్పేది లచ్చి మనసూ
నేనేమాని సెప్పేది లచ్చి సొగసు ॥ యేమాని ॥

మల్లెపూవులాంటిదీ లచ్చి మనసూ
కన్నెపిల్ల పరువాల లచ్చి మనసూ ॥ యేమాని ॥

యెన్నపూసలాంటిదీ లచ్చి మనసూ
మంచులాగ కరుగుతాది లచ్చి మనసూ ॥ యేమాని ॥

సింతసెట్టుకాడ లచ్చి సిందులేస్తున్నాది
గన్నేరు సెట్టుకాడ గంతులేస్తున్నాది ॥ యేమాని ॥

రావి సెట్టుకాడ నన్ను రమ్మనీ సెప్పింది
పొన్న సెట్టుకాడ నన్ను పొమ్మనీ సెప్పింది ॥ యేమని ॥



# మన జంట

ఎక్కవేలచ్చి బండి ఎక్కవే
జోడెడ్ల బండిలో జోరుగా పోదాము

జోడెడ్ల బండిలో
పాడుతు పోతుంటె
పల్లెపడుసులు సూసి
పళ్ళిగుల బెట్టేరు ॥ ఎక్కవే ॥

గడ్డివాడమూలెక్కి
మనము కూకుంటేను
గూడెము వాళ్ళంత
కూడేరు మనసుట్టు ॥ ఎక్కవే ॥

నీలిరంగు సీరకట్టి
నిమ్మతోటకు నీవు వస్తె
అమ్మలక్కలు నిన్ను సూసి
చెక్కిళ్ళు నొక్కేరు ॥ ఎక్కవే ॥

సద్దసేలలో మనము
సుద్దు లాడుతూ వుంటే
ఊరిపెద్దలు మనజంటని
ఉరిమురిమి సూసేరు ॥ ఎక్కవే ॥



యేటిలోనా పడవ నడిపి
యేటిఒడ్డున పొద్దుగడిపి – 2
సందెకాడ గూడు సేరేదా ?
నాసామి రంగా !
కోడికూర నీకు వండేదా ?

# బంధము

మావ : కంచిపుట్టు సీరకట్టీ
జానెడంచు రైకతొడిగీ
బండిమీద యెక్కి పోదామా ?
నాలచ్చి పిల్లా !
కాడెడ్ల బండి కట్టేదా ?

లచ్చి : కోరమీసం తిప్పి నీవు
జోడెడ్ల బండి కదితే - 2
కన్నె పిల్లల గుండెలదిరెనురా
నాసామి రంగా !
పల్లెపిల్లలు బెదరిపోదురురా !

మావ : పల్లెదాటి, పొలము దాటి
పల్లె పిల్లల పోరు దాటి - 2
ఏటిగట్టుకు మనముసేరేమా !
నాలచ్చి పిల్లా !
యేటిలోనా పడవ నడిపేమా ?

లచ్చి : యేటిలోనా పడవ నడిపి
యేటిఒడ్డున పొద్దుగడిపి - 2
సందెకాడ గూడు సేరేదా ?
నాసామి రంగా !
కోడికూర నీకు వండేదా ?

మావ : కోడికూర నాకు వద్దు
లచ్చిపిల్లే నాకు ముద్దు - 2
ముద్దులన్నీ యిచ్చిపోవేమే !
నా లచ్చి పిల్లా !
మూడుముళ్ళ బంధమేసేదా ?

లచ్చి : మూడుముళ్ళు నాకు వేసి
ముందుకాళ్ళకు బంధమేస్తే
నిందలన్నీ తొలగిపోవునురా !
నాసామి రంగా !
నిన్ను వదలి నేను వుండనురా !





# ఉగాది

ఉగాది పండుగ రావాల
ఉయ్యాల జంపాల ఊగాల
ఊరంత పండుగ సేయాల
ఉన్నోళ్ళు, లేనోళ్ళు కులకాల ॥ ఉయ్యాల ॥

కొమ్మలు సిగురులు వేయాల
పూవులు నిండుగ పూయాల
కాయలు దండిగ కాయాల
కోయిల పాటలు పాడాల ॥ ఉయ్యాల ॥

సిలకలు పలుకులు పలకాల
కోడళ్ళు కులుకుతు రావాల
మామలు మీసాలు దువ్వాల
కోడెలు రంకెలు వేయాల ॥ ఉయ్యాల ॥

అక్కలు బావలు రావాల
ఇల్లంత కళకళ లాడాల
అమ్మా, నాన్నలు సూడాల
కొత్త బట్టలు యివ్వాల ॥ ఉయ్యాల ॥

పులుపులు, తీపులు కలపాల
వలపులు, ప్రేమలు కలవాల
ఉగాది పచ్చడి సేయాల
వొద్దన్న బావకు యివ్వాల ॥ ఉయ్యాల ॥

సాములోళ్ళు పంచాంగం సదువాల
రాశి ఫలములు సెప్పాల
వైశాఖ మాసం రావాల
పెళ్ళిళ్ళు జోరుగ జరుగాల ॥ ఉయ్యాల ॥

# కదిరి తిరుణాల



లచ్చి రాయె, నా లచ్చిరాయె
లచ్చి రాయె, మాలచ్మిరాయె
కదిరి నరసింహుని, కనులారా సూద్దాము
కనులారా సూద్దాము, కథలు సెబు కొందాము॥ లచ్చిరాయె ॥

కంబంలో పుట్టినాడు
కదిరి నరసింహుడు
కాపాడ వచ్చినాడు
మా పాలి దేవుడూ .... ॥ లచ్చిరాయె ॥

సామినీ వేడినాడు
భక్త ప్రహ్లాదుడు
ప్రత్యక్షమైనాడు
ఉగ్రనరసింహుడు ॥ లచ్చిరాయె ॥

అక్కడా, యిక్కడా
అంతటా ఉన్నాడు
భక్తులూ కోరితే
వరములు యిస్తాడు .... ॥ లచ్చిరాయె ॥

తేరుపైనా సామి
ఊరేగుతున్నాడు
దారినిండా జనము
బారులు తీరారు .... ॥ లచ్చిరాయె ॥

దవనము మిరియాలు
తేరుపై కిసరేసి
కాయ కర్పూరాలు
సామికిచ్చొద్దాము .... ॥ లచ్చిరాయె ॥

పరుసలో పగడాల
సరముల కొనియిస్తా
కోరిన గాజులు
సేతులకు తొడిగిస్తా .... ॥ లచ్చిరాయె ॥

# పల్లకి

'ధర్మవరము' సంతలోన .... సందమామ
పట్టుచీరలిప్పిస్తాను .... సందమామ

'పామిడీ' సంతలోన .... సందమామ
పూలరయికలిప్పిస్తాను .... సందమామ

'పత్తికొండ' పరుసలోన .... సందమామ
పసుపుకుంకుమలిప్పిస్తాను .... సందమామ

'రాయదుర్గం' సంతలోన .... సందమామ
రాళ్ళకమ్మలిప్పిస్తాను .... సందమామ

'ముద్దనూరు' సంతలోన .... సందమామ
ముక్కుపుడక యిప్పిస్తాను .... సందమామ

'ఒంగోలు' సంతలోన .... సందమామ
వొంకిగాజులిప్పిస్తాను .... సందమామ

'ఉరవకొండ' సంతలోన ,... సందమామ
ఉంగరం యిప్పిస్తాను .... సందమామ

'జమ్ములమడుగు' జాతరలోన .... సందమామ
జడకుచ్చులిప్పిస్తాను .... సందమామ

'కదిరీ' తిరుణాలలోన .... సందమామ
మల్లెలు, దవనాలిప్పిస్తాను .... సందమామ

‘నంద్యాల’ సంతలోన .... సందమామ
నడుముకు డాబు ఇప్పిస్తాను .... సందమామ

‘కర్నూలు’ సంతలోన .... సందమామ
కాళ్ళకు కడియాలిప్పిస్తాను .... సందమామ
దేవుని ‘కడప’ సంతోన .... సందమామ
కాలిమెట్టె లిప్పిస్తాను .... సందమామ

‘అనంతపురము’ సంతలోన .... సందమామ
ఆకు, వక్కలిప్పిస్తాను .... సందమామ

‘పుత్తూరు’ సంతలోన .... సందమామ
పూలు, పళ్ళు యిప్పిస్తాను .... సందమామ

‘తాడిపత్రి’ సంతలోన .... సందమామ
తాళిబొట్టు తెచ్చేస్తాను .... సందమామ

‘తిరుమలేశుని’ సన్నిధిలోన .... సందమామ
తాళి మెడలొ కట్టేస్తాను .... సందమామ

‘పులివెందుల’ సంతలోన .... సందమామ
పూలపల్లకి తెప్పిస్తాను .... సందమామ

‘పలమనేరు’ సంతలోన .... సందమామ
పల్లకిలోన ఊరేగిస్తా .... సందమామ



# మా ఇంటి మా లచ్చి

తొలికోడి కూసిందీ
తెలతెల వారిందీ ....
మా ఇంటి మాలచ్చి
తలుపు తీసిందీ ....

కసువు సిమ్మేసింది
కళ్ళాపి సల్లింది ....
ముత్యాల ముగ్గేసి
మురిసిపోయిందీ ....

పసుపు గడపకు పూసి
కుంకుమలు పెట్టింది ....
గంగగోవు పాల
పొంగలీ సేసిందీ ....

తొలసి కోటా సుట్టు
లచ్చి తిరిగిందీ ....
గోమాతకు లచ్చి
పూజసేసిందీ ....

తూరుపూ తిరిగింది
దణ్ణాలు పెట్టింది
ముత్తైదు తనమిచ్చి
మెచ్చుమిమ్మందీ ....

•◉•



యేడు కొండల పైనున్న యెంకన్నకు మొక్కి
హుండి సుట్టు తిరిగి ముడుపు సెల్లించాలి ....

# లచ్చితో తిరుపతి

తిరుపతికియెళ్ళాలి
తిరుమలేశుని సూడాలి
నాలచ్చి మెట్లెక్కి
నా వెంట రావాలి .....

సుక్కల్ల పరవతము
యెక్కి పోవాలి
సక్కని నా లచ్చి
పక్క నుండాలి ....

ఒక్కొక్క మెట్టెక్కి
గోవింద పెట్టాలి
మోకాల మెట్లెక్కి
లోకాలు సూడాలి ....

గాలి గోపుర మెక్కి
కాలి బాటన యెల్లి
అడివంత దాటేసి
గుడి కాడి కెల్లాలి ....

తల నీలాలన్ని
సామికివ్వాలి
కోనేటిలో మునిగి
కోవెలకు యెల్లాలి ...

బంగారు వాకిళ్ళు
దాటి పోవాలి
వైకుంఠ వాసుని
దరిశించు కోవాలి ....

యేడు కొండల పైనున్న
యెంకన్నకు మొక్కి
హుండి సుట్టు తిరిగి
ముడుపు సెల్లించాలి ....

కాయ కర్పూరాలిచ్చి
కదలి రావాలి
సల్లంగ సూడమని
సామి నడగాలి ....







# లచ్చి వలపు

యేతమెత్తి నేను
అలసిపోయిన వేళ
తలపులో తానొచ్చి
వలపునందిస్తాది .....

కంచంలో బువ్వెట్టి
కలుపుకోమంటాది
అందులో తన వలపు
నంజుకోమంటాది ....

మంచంపై పక్కేసి
పండుకోమంటాది
కలలోన తానొచ్చి
గిలిగింత పెడతాది

సలివేస్తే కొంగును
కప్పుతానంటాది
కౌగిళ్ళ సలిమంట
కాసుకోమంటాది



# కొఱ్ఱ సేను

లచ్చి : కొండ దగ్గర కొఱ్ఱసేను
కోతకెళ్ళిన కుఱ్ఱవాడ
కొత్తకొడవలి పదునుగున్నదిరా !
నా ముద్దూల మగడా !
సాలు సూసి కోత కోయుమురా !

మావ : సాలు సూసి కోత కోసి
కొఱ్ఱ గడ్డి మోపు గట్టి
కంకులన్నీ కుప్ప రాల్చేదా ?
నాలచ్చి పిల్లా !
గింజలన్నీ తూరుపెత్తేదా ?

లచ్చి : గింజలన్నీ తూరుపెత్తి
సంచులన్నీ బండికెత్తి
బండి మీదా యెక్కిపోదామా ?
నా ముద్దూల మగడా !
బస్తికెళ్ళి సంత సేద్దామా ?

మావ : బస్తికెళ్ళి సంతసాన
గింజలమ్మి సంతసేసి
సందెకాడ గూడు సేరేమా ?
నాలచ్చి పిల్లా !
కొఱ్ఱ బువ్వ నాకు వండేవా ?

లచ్చి : కొఱ్ఱబువ్వ సద్దిగట్టి
కొండ సేనుకు నేను వస్తె



చెట్టు కొమ్మకు
ఉయ్యాల వేయమంటాది
పాటనను పాడమని
తానూగుతుంటాది ...

# ఎర్రి లచ్చిమి

మావ : సంతకెళ్ళి వస్తానె, సిన్ని లచ్చిమి
నీకు సరుకులేమి కావాలో సెప్పు లచ్చిమి

లచ్చి : సరకులేమి నాకు వద్దు సిన్నవాడా
నాకు మల్లెపూలు తేవోయి సందెకాడ ....

మావ : మల్లెపూలు తెస్తానె సందెకాడ
నాకు మంచమేసి వుంచవే ఇంటికాడ ....

లచ్చి : మంచమేసి వుంచుతాను సిన్నవాడ
నా వలపునంత దోచుకోర వన్నెకాడ ....

మావ : వలపునంత దోచుకొంటి సిన్నదాన
నీ బుగ్గలేల ఎరుపెక్కె యెర్రిదాన ....

లచ్చి : బుగ్గలన్ని యెరుపెక్కె సిన్నవాడ
నీ వగల సెగలు తగిలితేను వన్నెకాడ ....



# లచ్చి అలక

నాలచ్చి మీయవే
నాకింత సోటు
నీ పక్క నేనుంటె
నాకేమి లోటు ....

నీవలిగి కూకుంటె
నాదరికి రానంటె
కుదురుగా నామనసు
నిలువనంటాది ....

కళ్ళకేమో నిదుర
రానురానంటాది
కడపులోసెయ్యేట్టి
కలిపినట్టుంటాది ....

సుక్కలు సూసేను
పక్కుమని నవ్వేను
'లచ్చి' మగడని నన్ను
యేలెత్తి సూపేను ....

రేయంత గడిసేను
సూరీడు వొచ్చేను
యెర్రబడ్డ కళ్ళు సూసి
యెగతాళిసేసేను ....

నాలచ్చి మీయవే
నాకింత సోటు
నాపక్క నీవుంటె
నాకేమిలోటు ....



సూరీన్ని అడిగినాను  సెందరున్ని అడిగినాను
సుక్కల్ని అడిగినాను  దిక్కులన్ని సూసినాను
యాడుంటివే లచ్చి యాడుంటివే ....

మల్లమ్మ నడిగినాను
పుల్లమ్మ నడిగినాను
యెందరిని అడిగినా
నీజాడ సెప్పలేదు .... ॥ యాడుంటివే ॥

సూరీన్ని అడిగినాను
సెందరున్ని అడిగినాను
సుక్కల్ని అడిగినాను
దిక్కులన్ని సూసినాను .... ॥ యాడుంటివే ॥

కొల్లాపురమ్మకు
కోడినే నిస్తానంటి
మారెమ్మకూ నేను
మేకపోతిస్తానంటి .... ॥ యాడుంటివే ॥

పోలెరమ్మ గుడికాడ
పొట్లినేనిస్తానంటి
యంకన్న సామికేమొ
జుట్టునేనిస్తానంటి .... ॥ యాడుంటివే ॥



# మావ మోజు

లచ్చిపాటంటే మావ
సెవి కోసుకొంటాడు
లచ్చిపాడుతు వుంటె
మైమరసిపోతాడు ....

లచ్చిజాడ కనరాక
కొండవాగుల్లోన వెదికాడు
గుడిగోపురాలెక్కి
"లచ్చీ" యని అరిసాడు .....

లచ్చి కనబడగానే
యెగిరి గంతేశాడు
లచ్చిలేకుంటే తాను
బతుకలేనంటాడు ....

సీరలు సొమ్ములు
లచ్చి కిచ్చాడు
తెచ్చిన పూలన్ని
కొప్పులో తురిమాడు ....

సీరలు సొమ్ములు
తనకొద్దు అంటాది
తన "మావ" తనకేమో
కోటీశుడంటాది - 'లచ్చి'





సూరీడొచ్చే యేళాయని
సుట్టు పక్కల సూశానమ్మా
సక్కనైన నా మావ
పక్కనే వున్నాడమ్మా ....

# నాగులచవితి

పుట్టలోన పాలు పోసేము నాగన్న
పొట్టనిండ నీవు ఆరగించన్నా .... ॥ పుట్టలోన ॥

మొగలి పొదలలో నీవు తిరుగుతుంటావు
మల్లెపొదలలో నీవు మసలుతుంటావు
పచ్చిక బయలులో పారాడుతుంటావు
గాలినే పీల్చుతు బతుకు తుంటావు .... ॥ పుట్టలోన ॥

శివుని మెడలో నీవు ఆభరణమైనావు
పద్మనాభుడికి నీవు పాన్పువైనావు
నీ తలపైన కన్నయ్య నాట్యమాడాడు
బొజ్జగణపయ్య నిన్ను పొట్టకు కట్టాడు .... ॥ పుట్టలోన ॥

నా మగని నీవెపుడు సల్లంగ సూడన్నా
ముత్తయిదు తనమును కాపాడుమన్నా
నాగుల చవితికి నీ నోము నోసేము
నానబాలు, సలమిడి నీకు పెట్టేము .... ॥ పుట్టలోన ॥



# పొగబండి

పట్టాలమీద పొగబండి
పోతుంది తస్సదియ్యా రాజమేంద్రి .... ॥ పట్టాల ॥

రెక్కమాను వొంగినాది సూడండి
రైలుబండి కదలుతోంది ఎక్కండి
విజిల్ వేస్తె కూతబెట్టి కదలునండి
గొలుసు పట్టి లాగితే ఆగునండి .... ॥ పట్టాల ॥

పచ్చజండ ఊపితే కదలునండి
యఱ్ఱజండ ఊపితే ఆగునండి
నీలిబట్ట లేసినాడు డైవరండి
తెల్లబట్ట లేసినాడు గారుడండి .... ॥ పట్టాల ॥

టిసిగారు వచ్చినారు సూడండి
టిక్కట్టు అడుగుతారు సూపండి
టిక్కట్టు లేకుండా జరుగదండి
ఇక్కట్లు పడుతారు తెలుసుకోండి .... ॥ పట్టాల ॥

రైలుబొగ్గు దానికేమో అన్నమండి
నీటిఆవిరి దానికేమో ఊపిరండి
సాగిపోతే అదియేమో పొగబండి
ఆగిపోతే అది శ్యాన జగమొండి .... ॥ పట్టాల ॥

నిప్పు, గిప్పు పెట్టెలోన పెట్టకండి
అది అంటుకొంటె ముప్పు మీరు కల్సనండి
సిన్నపెట్టె, పెద్దపెట్టె సూసుకోండి
దొరల్లాగ వుంటారు దొంగలండి .... ॥ పట్టాల ॥

ఉన్నోళ్ళకేమో పైక్లాసు
లేనోళ్ళకేమో కిందిక్లాసు
తేడాలు దానికేమో తెలియవండి
ఊరుసేర్సుటే దాని ధర్మమండి .... ॥ పట్టాల ॥

పుట్టినింటికెళ్తోంది నాలచ్చిమి
పురుడు పోసుకొస్తానంది నాలచ్చిమి
నాలచ్చి ఎక్కింది రైలుబండి
సన్నిడిసి పోతోంది రాజమండ్రి .... ॥ పట్టాల ॥



# కరువు సీమ

తొలకరి వానల్లు
తొంగిసూడాలి
తొలిసూలుతో
లచ్చి మురిసిపోవాలి ..

వానల్లు కురవాలి
వరిసేలు పండాలి
కూలినాలి జనాల
కట్టాలు తీరాలి ....

సెమటోడ్చి పనిసేస్తె
శాటెడు గింజలు
కట్టపడి పనిసేత్తే
కడివెడు గింజలు ....

యేరుసెనగ పంట
యెఱ్ఱిగా పండాలి
కరవుసీమలో రైతన్న
కట్టాలు తీరాలి ....





సర్కారు దొరలేమో సట్టాలు సేసారు
పాటించకుంటేను కట్టాలు పడుతాము
యెర్రత్రికోణము గురుతు సూడరా మావ
ఆపరేసను నేను సేయించుకొంటాను ....

# ఎర్ర త్రికోణం

ఇద్దరు పిల్లలు ముద్దుర మావ
ఆపై పిల్లలు వద్దుర మావ
అధిక సంతానము అదుపు సేద్దాముర
పొదుపుగా కాపురము సాగిద్దాముర మావ .... ॥ ఇద్దరు ॥

సంకలో పిల్లోడు, సెయ్యన్న దిగలేదు
కడుపులో శిశువేదొ కదలాడుతున్నాది
పుట్టగొడుగులల్లె పిల్లలు పుడుతుంటె
కంట్రోలు బియ్యము కరువయ్యి పోయె .... ॥ ఇద్దరు ॥

పాలులేకా బిడ్డ పోరు పెడుతూవుంటె
సంటోడు బువ్వయని గోలసేత్తున్నాడు
దేవుడీవరమని పిల్లలను కంటుంటె
దేశమూ జనముతో నిండి పోయేనూ .... ॥ ఇద్దరు ॥

ఒక్కడీ సంపాదన ఒక్కపూటకు రాదు
గుక్కెడు గంజితో కాలమ్ము గడపాలి
రేయంత పస్తుండి పగలు పనికెళ్ళాలి
పంపునీళ్లతో కడుపు నింపుకోవాలి .... ॥ ఇద్దరు ॥

సదువు సందెలు లేక సవట లౌతారు
మందు మాకులు లేక అవటి వాళ్ళవుతారు
పనులు దొరకకా శ్యాన అగసాట్లు పడుతారు
కూటికీ గుడ్డకు లేని వాళ్ళవుతారు .... ॥ ఇద్దరు ॥

సర్కారు దొరలేమొ సట్టాలు సేసారు
పాటించకుంటేను కట్టాలు పడుతాము
యెర్రత్రికోణము గురుతు సూడరా మావ
ఆపరేసను నేను సేయించుకొంటాను .... ॥ ఇద్దరు ॥

# తాగొద్దురా మావ

తాగొద్దురా మావ, తాగొద్దురా
తాగినీవు, తూలుతూ, రావద్దురా
మనిషిగా యింటికీ రావాలిరా
మంచి మనిషిగా యింటికీ రావాలిరా ! ॥ తాగొద్దురా ॥

గొంతుదాక తాగి నీవు
గోలసేత్తుంటావు - 2
కోడికూర లేదంటూ
గొడవ సేత్తుంటావు
ఇరుగు పొరుగువారు సూసి
సీదరించు కొంటారు .... ॥ తాగొద్దురా ॥

ఇల్లంతా గుల్లాయె
ఊరంతా అప్పులాయె
ఇంటిలోని పాత్రలన్ని
కుదువలకే సరిపోయె
వండుకోడానికి
కుండ కూడలేదాయె .... ॥ తాగొద్దురా ॥

రెక్కలు ముక్కలాయె
డొక్కలు మాడిపోయె
తెచ్చిన సంపాదనంత
తాగుడుకే సరిపోయె
నూకలు కొందామంటే
రూకలు లేవాయెరో .... ॥ తాగొద్దురా ॥

కల్లూ, సారాయి తాగి
దేహమంత కాలిపోయె
సదువుమాని సంతానము
కూలీలుగ మారిపోయె
నమ్ముకొన్న మా బతుకులు
నవ్వులపాలాయెరో .... ॥ తాగొద్దురా ॥

# లచ్చి పయనం

గోదారికెళ్ళింది నా లచ్చిమి
నాదారి రానంది నా లచ్చిమి
పుష్కరాల కెళ్ళింది నా లచ్చిమి
పుణ్యమంత తనదంది నా లచ్చిమి .... ॥ గోదారి ॥

భద్రాద్రి రాముణ్ణి నా లచ్చిమి
భక్తితో కొలిసింది నా లచ్చిమి
రామయ్య తండ్రంది నా లచ్చిమి
సీతమ్మ తల్లంది నా లచ్చిమి .... ॥ గోదారి ॥

కొత్తసీర కట్టనంది నా లచ్చిమి
మల్లెపూలు ముట్టనంది నా లచ్చిమి
మాటైన సెప్పలేదు నా లచ్చిమి
మూటముల్లె కట్టింది నా లచ్చిమి .... ॥ గోదారి ॥

పుట్టినిల్లు సొరగమంది నా లచ్చిమి
మెట్టినిల్లు నరకమంది నా లచ్చిమి
కంట తడిపెట్టింది నా లచ్చిమి
జంట వీడి పోయింది నా లచ్చిమి .... ॥ గోదారి ॥

గుండెమంట లేపింది నా లచ్చిమి
గుట్టేదొ దాసింది నా లచ్చిమి
పాడుబుద్ధి నాదంది నా లచ్చిమి
పడవెక్కి పోయింది నా లచ్చిమి .... ॥ గోదారి ॥





కలలోన నాలచ్చి కనుగీటి పోనాది
కలుసుకొందామంటే కనబడక పోనాది ....

# ఎడబాటు

నాలచ్చిపోనాది, ననువీడి పోనాది
యేడనున్నదో లచ్చి యేమి సేత్తుందో .... ॥ నాలచ్చి ॥

పొద్దున్నె నాలచ్చి
సద్దిచ్చి పోయేది
సుద్దులూ సెప్పేది
ముద్దిచ్చి పోయేది .... ॥ నాలచ్చి ॥

మద్యాన్న నాలచ్చి
మామిళ్ళ తోటలో
మాటిచ్చి పోనాది
మరి రాక పోనాది .... ॥ నాలచ్చి ॥

సందమామ యెలుగుల్లో
అందమైన నాలచ్చి
సందె బువ్వపెడుతుంటె
మైమరచి తింటుంటి .... ॥ నాలచ్చి ॥

పిట్టగోడెక్కి నాలచ్చి
కట్టుకతలల్లేది
పట్టుకోనూ బోతె
పారిపోనాది లచ్చి .... ॥ నాలచ్చి ॥

నాలచ్చి పాడింది
నను సూసి నవ్వింది
వత్తానని సెప్పింది
రాకుండ పోనాది .... ॥ నాలచ్చి ॥

కలలోన నాలచ్చి
కనుగీటి పోనాది
కలుసుకొందామంటే
కనబడక పోనాది .... ॥ నాలచ్చి ॥

కనిపించవే లచ్చి
కనులు కాయలు కాసె
కతలు సెప్పవె లచ్చి
కలతలన్నీ పోతాయి .... ॥ నాలచ్చి ॥

సెంత సేరవె లచ్చి
సెబుతాను ఒకమాట
నీవులేనీ బతుకు
బతుకలేనే యింక .... ॥ నాలచ్చి ॥



# జీవిత మర్మం



నరకం ఎక్కడ లేదురా
అది నీ పక్కన ఉన్నది సూడరా
వెలుగు నీడలా వెంటాడునురా
ఎన్నో జన్మల కర్మఫలమురా .... ॥ నరకం ॥

పాపపుణ్యముల చదరంగమురా
పాము, నిచ్చెనల వైకుంఠపాళిరా
పామునోట పడితే అది నరకమురా
నిచ్చెన దొరికితె స్వర్గమురా .... ॥ నరకం ॥

ఆలి అలిగితే అది నరకమురా
ఆ ఆలి మెచ్చితే అది స్వర్గమురా
కలతల, మమతల సంసారమురా
కష్ట, సుఖాలకు నిలయమురా .... ॥ నరకం ॥

ఉన్ననాడు నీకందరురా
లేనినాడు లేరెవ్వరురా
వెళ్ళేటప్పుడు వెంటరారురా
నీమంచీ, చెడులే నీకు తోడురా .... ॥ నరకం ॥

చావు పుట్టుకల చక్రమురా
ఇది ఆగక తిరిగే యంత్రమురా
ఆశ నిరాశల పయనమురా
ఆ చితి మంటలలో కలిసిపోవురా .... ॥ నరకం ॥

ఇంతేరా ఈ జీవిత మర్మం
అది తెలియక పోతే నీ కర్మం .... ॥ నరకం ॥

# విధిలీల



ఎవరికి ఎవరు ఏమౌతారో
ఎవరికి తెలుసు ?
ఎవరిని, ఎవరికి జత చేస్తాడో
ఆపరమాత్ముడికే ఎరుక !
జన్మజన్మల అనుబంధం
ఈ సంబంధం
ఆదేవుడు ఆడే ఆటలో
మానవులంతా పావులే
ఆదేవుడు చేసిన బొమ్మలే అందరం

అనుకొన్నవన్నీ జరుగునా ?
అందరికి ?
జరిగేదేమిటో తెలిసేది
ఎందరికి ?
తెలిసినవాడొక్కడే, అతడే
ఆభగవంతుడు !
జరిగిన దానికి వగువకు
జరిగేటందుకు సాగుము ముందుకు

ఆశ నిరాశల నీపయనంలో
గెలుపు ఓటములు దైవాదీనం
గెలుపుకు నీవు పొంగకు
ఓటమి చెందిన కృంగకు
ఓటమి గెలుపుకు తొలిమెట్టు
గెలిచేవరకు వదలకు పట్టు .....



# మాయాలోకం



అహజీవా నీవింక చింతమానవే
కోరిసద్గురుని చెంత చేరవే .... ॥ అహజీవా ॥

గూటిలోపల వన్నెల చిలుక
ఎగిరిపోవును ఒక్కనాటికీ
నీవెంత మచ్చికతో పెంచినగానీ .... ॥ అహజీవా ॥

తిరిగిరాని పయనమెటులకో
చెప్పునా చిలకమ్మా గూటితో
ఈరాక పోకల గుట్టు విప్పునా .... ॥ అహజీవా ॥

వింతలోకపు సంతలోపలా
కుప్పిగంతులు ఎంతకాలమూ
నీనెత్తిపైనే మృత్యువు నీడలు .... ॥ అహజీవా ॥

మాయాకాయము నిజమనినమ్మి
భ్రాంతిలోన మునిగి తేలకే
నీదేహములోని దేహని కనుగొను .... ॥ అహజీవా ॥

వేదాంగములు చదివిన వారికే
అంతుబట్టునా సృష్టిలీలలూ
నీవొచ్చినచోటుకే తిరిగి చేరుకో .... ॥ అహజీవా ॥



# ముక్తి మార్గము



ఏజన్మలో నీవు, ఏమి కర్మము చేసి
ఈ జన్మ మెత్తావు మనసా !
జన్మ, జన్మకు కర్మ తొలగించు కొంటేను
మరు జన్మ ముండదే మనసా !

కొండంత పత్రితో దేవుణ్ణి కొలిచితే
పాపములు తొలగవూ మనసా !
దాన, ధర్మము చేసి, దయతోడ మెలిగితే
దేవుడూ, నిను మెచ్చుమనసా !

కలిమికీ కులుకుతూ, లేమికి వగచుచూ
కాలమ్ము గడిపేవు మనసా !
కలిమి లేములు రెండు కావడీ కుండలను
సత్యమును తెలుసుకో మనసా !

అంటరానీవాడు నీవెంటపడితేను
అడ్డంకి పలికేవు మనసా !
వెళ్ళిపోయేనాడు, తోడెవ్వరుంటారు
మర్మమును తెలుసుకో మనసా !

సంసారమొకవైపు, సంతానమొకవైపు
బంధించి వేసేరు మనసా !
బంధాలు తెంచుకొని, బయటపడితే నీకు
ముక్తి మార్గము కలుగు మనసా !